క. తనదొరలు పన్ని నిలిచిన, పెనువాకిట నిర్గమించి పృతనాభారం
బున మేదిని నలినలిగాఁ, జనుఁదేరఁగఁ జూచి రామచంద్రుం డంతన్. 75

వ. విభీషణుం బిలిచి. 76

→{ రాముఁడు రావణసైన్యముఁ గని యచ్చెరువడి విభీషణు నడుగుట. }←

శా. ఊర్ధ్వాజాండకటాహ ముచ్చి చన భూమోభూయరుద్యన్నిజాం
తర్ధ్వానంబులు విస్మయంబు వెనుపన్ మధ్యాహ్నమార్తాండరో
చిర్ధ్వంసం బొనరించుకొంచు నదె ప్రాచిం దోఁచె నక్కోటపై
దుర్ధ్వాంతం బిది యేమొకో యనినఁ జేతుల్ మోడ్చి యాధన్వికిన్. 77

తే. రావణానుజుఁ డనియె నోరఘువరేణ్య !, యాఁపలుపు దానవేంద్రునిసేన సుమ్ము !
కారు క్రమ్ముమ రోఁజుచుఁ గదలి వచ్చె, నీలధూళినిచోళయై నింగి మోచి. 78

→ విభీషణుఁడు రామునకు రావణు సామర్థ్యం బెఱింగించుట. ←

కవిరాజవిరాజితము.—

తెలిసినవాఁడు హుయల్ విలువిద్యకు దిక్పరిపాలురదీవులకున్
వెలసినవాఁడు ప్రహస్తుఁడు మానవినీతుఁడు నై తనరాణువకున్
గలిగినమంత్రి తదీయభుజాబలగర్వకథల్ మననీలునిచే
వెలిసిన నన్నగు లాత్మ సహింపక వెల్వడెఁ బంక్తిముఖుం డనికిన్. 79

వ. అవ్వీరుం డవార్యశౌర్యం డయిన తెఱం గెఱింగింతు నవధరింపుము. 80

శా. ఆదిం బన్నగరాట్ప్రభంజనులలో నన్యోన్యసామర్థ్యసం
వాదం బొక్కటి పుట్టి చిల్వదొర దేవగ్రావముం జుట్టి వి
చ్ఛేదింపంగఁ బ్రతిజ్ఞ పల్కుకొని పీచెన్ గాడ్పు దానన్ దిశల్
దూదుల్ దూలినయట్లు తూలుటయు నింద్రుం డాదిగా దిక్పతుల్. 81

సీ. కంపించి శేషునికడ కేఁగి యాభోగి, కులనాథ ! యీయద్రికూట మొకటి
వైపవే యీమహావాతూలవరువాత, నరువాత నినుఁ బ్రతివాసరంబు
తలఁచి యేము భుజించెదము గాని యంతట, గానిపోఁడీభూతఘాతుకుండు
నావుడు నతఁ డొకింతఫణాగ్ర మెత్తిన, విఱుగ విసరి యిందు వేసెగాడ్పు

ఆ. లంక యయ్యెఁ దదకళంకభూధరశృంగ, భంగ మంతనుండి బలిగృహంబు
విడిచి వచ్చి విడిసి రచటి మాలి సుమాలి, మాల్యవంతు లిచట మనుజనాథ!. 82

ఆ. విష్ణుదేవుచేత వెస మాలి పస మాలి, కడుసు మాలి యొడలి తోడుసు మాలి
బాలియు బలిని జేరెఁ బూర్వస్థితికి మూపప, లేమి మాల్యవంతుఁ డో మహాత్మ !. 83

ఉ. రక్కసు లుక్కడంగి చన రాజయి రాజ్యము చేసె రాజరా
జిక్కడ వచ్చి నాఁటిమొద లిప్పురి నంతఁ బులస్త్యపుత్త్రకుం
డక్కడ మాల్యవత్తనయయందుఁ గనెన్ మము ముప్వురన్ దిశల్
వొక్కఁగఁ జేసి యుగ్రతపముల్ దశకంఠుఁడుఁ గుంభకర్ణుఁడున్. 84

సీ. జలజసూతిమదగ్రజాలకుఁ బ్రసన్నుఁడై, యడుగుఁ డిష్టవరంబు లని వచింప
నిద్ర వేఁడుకొనియె నిర్దయత్వము వేఁడి, కొనఁ బోయి వాతప్పి కుంభకర్ణుఁ
డీరావణుఁడు మర్త్య లేలెక్క? యని తక్క-, వారిచేఁ జావుండ వరము వడసి
యేఁగుదెంచి కుబేరు నియ్యూరు వెడలంగఁ, గొట్టి తాఁ బట్టము గట్టుకొనియె

తే. నతనిపుష్పక మపదఁ గా నందుకొనియె, వాసవాదులఁ గమతులఁ జేసికొనియె
నిరువది యినుపకంబాలయెత్తుమేడ, నినయ బాహులఁ గైలాస మెత్తిపట్టె. 85

తే. ఇతఁడు మూఁడుకోట్లు నేఁబదిలక్షలు, వత్సరములు హరునివరమువలన
నుండువాఁడ కాఁడె యొకవృద్ధవిప్రుఁడై, వచ్చి శౌరి మోసపుచ్చెఁ గాక. 86

క. కోఁతి యని తెగడె వలిమల, కూఁతున్ నందిమొగ మందికొని యిట్టిదివో
క్రోఁతి యని నవ్వెఁ గడపటఁ, గోఁతియుఁ గ్రోఁతియును జేటగుట గనిపించెన్. 87

క. పాటించి నారదాదుల, పాటలపైఁ జూపఁ డితఁడు బందీదివిష
త్పాటలగంధులకొండల, పాటునఁ బలవించురొదలపైఁ గల ప్రేమల్. 88

వ. అని యుత్తలంగున విభీషణుండు నిజాగ్రజుం డయినరజనీచరరాజు సామర్థ్యంబు
నౌద్ధత్యంబు నభివర్ణించిన విని విభుండు విస్మితుండై వీక్షింపుచుండె నయ్యవసరంబున.

సీ. పెరికి కుత్తుకలకు విరివిబల్లాఁకులు, గదలుగాఁ గొని మ్రోలఁ గదలువారు
ముఖరఘురీవారిమోచేతులకు జాఁటఁ, గరముల గిరులెత్తి కదలువారు
నేనుంగు తేరు తేజీ నిల్చునే? యంచుఁ, బిడికిళ్లతో నార్చి పిలుచువారు
నావచ్చు రిపులవాహనములే సమరసా, ధనములు తమ కంచుఁ దాఁకువారు

తే. నేరుపు నాల్గుపొఁజులై యెప్పు డెప్పు, డుర దురం బనుచున్న వానరులఁ జూచి
లినవారలతోడ నొక్కింతతడవు నన్నుఁ, జూడుఁడీ యని దశకంఠుఁ డాడి యపుడు.

## సుగ్రీవుఁడు రావణు నెదిర్చి మూర్ఛిల్లుట.

ఉ. పైఁడిరథంబుతోఁ బ్రళయపావకపట్టము నేఁడు కట్టుకో
న్నాఁడో యితం డనం గనలునం గను గ్రుడ్లు గవల్చి కాయుకో
ప్వేఁడిమిఁచే దిగంతములు వెచ్చపడన్ బలభేదిమీఁదిమా
ట్టేఁ డతఁ డొక్కఁడున్ గడువడిన్ గదియఙ్కపిరా జుదగ్రుఁడై. 91

క. ఒకపాదపంబు కేలం, బెకలిచికొని యెదుర భిదురభీకరబాణం
బొకటి యతఁ డేయ నగ్గా, లికి నినజుఁడు వడియెఁ జెట్టు లేచెం బయికిన్. 92

వ. ఇత్తెఱంగున సుగ్రీవుండు మూర్ఛిల్లిన నుల్లంబుల శేష క్రోధంబులు గ్రమ్మం జిమ్మరేఁగి.

### రావణుఁడు గజాదివానరవీరులను మూర్ఛ నొందించుట.

క. గజగవయగవాక్షాదులు, గజిబిజియవలుపులు చెలఁగఁ గదిసి గురుగిరి
వ్రజములు గురియఁ గనుంగొని, రజనీచరరాజు రౌద్రరసవివశుం డై. 94

చ. శరశతకోటులం దొరుఁగు శైలములం జిఱునుగ్గుచేసి వా
నరు లపు డెంద లేర్పడి రణం బొనరించిరి వారి నందఱన్
బరిఘపరశ్వధాదుల సవాలుగ మూర్ఛ మునుంగఁ గ్రమ్మి య
చ్చరములు మాని యుండుఁ డిఁకఁ జచ్చినయట్లని నవ్వె నార్చినన్. 95

క. పట్టినగట్లుం జెట్లుం, గట్టెదురన్ వైచి మరలి గట్లుం జెట్లున్
బట్టెఁ బ్లవంగానీకము, లట్టిట్టయి కలఁగఁబడి భయభ్రాంతములై. 96

వ. అప్పుడు. 97

చ. బలములపాటు దాయ తలపాటును జూచి పు డడ్డపాటుకో
ర్తల కొడ బాటు లెస్స యని లక్ష్మణుఁ డన్నయనుజ్ఞ? గాంచి వ
ల్కలములఁ గాసె గట్టి జడలన్ సిక వేసి వెడందవిల్లు న
మ్ములపాదిదోయి దాల్చి విలు మ్రోయఁగఁ జేయుచుఁ బోరఁ బోవఁగన్. 98

### హనుమంతునిచే రావణుఁడు మూర్ఛిల్లుట.

ఆ. తలకడచి సమీరతనయుఁ డద్దశకంఠుఁ, దారసిల్లి యేమి దనుజనాథ!
క్రొత్తయిండ్లు గట్టుకొంటివే? నేఁ జూమీ, నాఁటివాఁడ మఱచినాఁడ వేమొ? 99

ఉ. ఎక్కటిఁ గాసెకోక బిగియించితివేమి? సహాయసేన న
ల్లక్కడఁ బెట్టి నీయొకనియాగడ మింతఱగోడునైన నేఁ
డక్కటికంబు పుట్టెనో? మహాగుణమే యిది? నిక్కమైన నీ
మిక్కిలి మూఁకనెల్లఁ గునిమించక చావవుగాని రావణా! 100

వ. అనవుడు నద్దశకంఠుండు హనుమంతుం జూచి. 101

తే. ఏమఱినవేళఁ గాఁ జూచి యెలుక యొకటి, దిగదిగన వచ్చి ప్రమిదలో దీపకళిక
కఱచికొనిపోయి ముంజూరు కాలఁబెట్టి, నట్ల యైనది యైన నేమయ్యె నోరి? 102

ఉ. మీదొర మేదురాగ్రహసమేతుఁడు సూర్యసుతుండు దేవతా
సూదనబాణవేగమున సొమ్మసిలెం జెవిలోన సొంటికొ
మ్మూఁదినవాఁడ వైతివె? యయో! యిటువంటివె భృత్యకృత్యముల్?
గా దనిపించుకోఁ దడవు గాదుర వానర! యెందు నావుడున్. 103

క. నిను వరియింపఁగ నున్నది, యినతనయునిమూర్ఛ వచ్చి యిపు డనుడు నడే
మును నీసత్త్వ మెల్లం, గొనని న్నొకపెట్టుఁ జూచుకొనియెద ననినన్. 104

క. బండికలు దన్ని పైఁబడి, గుండె లగలఁ బవనసుతుఁడు గుద్దిన బాహా
దండములు పొలుపఁ జూచి యా, తండు వడిం బోరగిల రథం బద్రువంగన్. 105

క. పడి మూర్ఛిలి యొక్కించుక, తడవునకున్ లేచి నుతియొఁ దల తిరిగిపడన్
బడఁబోయి నిలిచి పవనజుఁ, బిడికిట మూర్ఛిల్లఁ బొడిచి పిలిచె న్నీలున్. 106

### నీలుఁడు రావణుతోఁ బోరుట.

వ. అంతం దశారి మార్కొనియె నంత హనుమంతుండు మూర్ఛ దేఱి తనకన్న మున్న తెలిసి
సేదలు దీర్చుకొని జగడంబునకుం దివురురవితనయ ప్రముఖులం గూడుకొనియె నప్ప
టికి నీలుండు కయ్య మందుకొని పెనంగు చునికిం దమకుం దఱియ నుఱికి దొమ్మి
సేయం దగవు గా దని చూచుచుండి రయ్యెడ రావణుండు. 107

క. అబ్బురపుటంపబోనున, నిబ్బరపుంగడఁక యుడిపి నిలిపెన్ వలచే
గుబ్బలితోఁ బొబ్బలతోఁ, బెబ్బులివలె వచ్చునీలు భిదురాభీలున్. 108

ఉ. ఇట్టటు మెట్టనీక యసురేశ్వరుఁ డీగతి నడ్డపెట్టినం
బట్టిన గట్టువైచి యతిమాత్రతనూకృతగాత్రుఁడై తనుం
జుట్టినయంపపెండె మొకచోఁ ప్పున వెల్వడి మేను వెంచి క
న్పట్టి ప్రభంజనప్రియునిపట్టి దిశల్ నడఁ గూఁక వెట్టునున్. 109

వ. గుప్పునం గకుప్పతి భయంకరుపైఁ గుప్పించి. 110

క. సిడ మెక్కు గొడుగు నొక్కన్, మెడ ద్రొక్కం గ్రింద నక్కు మీఁద న్నిక్కన్
జడిముడి ముడివడునొడువుల, దడపెట్టుం పలలు మెట్టు దవడలు గొట్టున్. 111

క. ఆలో నాలోకించిన, వేలుపు లయ్యసుర చెవికి వినరా నొరా!
నీలా నీ లా వెంతయు, మే లని యచ్చెరువుపడుచు మెచ్చిరి యతనిన్. 112

తే. అప్పు డమరారి మదిఁ గోప ముప్పతిల్ల, గీలిశర మేసెఁ గాలిపా కాలు మనుచు
నస్త్రశిఖినీలునకు విమోహంబ యొసఁగెఁ,బగరపనుపునఁ గొడుకుపైఁ దిగు నె తండ్రి?.

క. ఈలీల న్నీలుఁడు మూ, ర్ఛాలుఁడై వ్రాలి లేచునంతటిలో వీ
రాలాపముఖుఁడై రాఁ, గా లక్ష్మణుఁ డద్దశాస్యుఁ గని మార్కొనుచున్. 114

ఆ. అపుడు మించి మించ నాడినమాటల, కెన్ని యక్షరంబు లన్ని శరము
లసురనోళ్ల గ్రుచ్చె నతఁడు నయ్యమ్ములఁ, గొతికి యుమిసి పెక్కుకోల లేసె. 115

వ. వెండియు నయ్యిరువురుం బరస్పరజయాభిలాషంబున. 116

క. మోఁగుచుఁ దూపులు తూపుల, నాఁగుచు దుస్తరశరక్షతారుణవారిం
దోఁగుచు మూర్ఛాదశలం, దూఁగుచు రేఁగుచుఁ బెనంగ దొరకొని రాజిన్. 117

## రావణుశక్తిచే లక్ష్మణుఁడు మూర్ఛిల్లుట.

ఉ. ఆత్తఱి లక్ష్మణుం డొకమహావిశిఖంబునఁ దూపుతోడ వాఁ
డెత్తినవిల్లు ద్రుంచిన బళీ ! యని విశ్వవిధాయిదేవతా
దత్తమహోగ్రశక్తి తనదక్షిణపాణి నతండు పూని యీ
మిత్తికిఁ గూడుగాఁ గనెఁ జుమీ నిను నీజనయిత్రి లక్ష్మణా ! 118

చ. అని యటు చెప్పి త్రిప్పి వెస నార్చుచు వేసిన నయ్యసాధ్యసా
ధనము నినాదనిష్ఠురము తాపధురీణము నిర్భరప్రభం
జనభరితంబు దివ్యశరజాలనిరోధనిరాసకంబు దో
ర్ధనురమిత్రప్రహారకుపితంబును నై తనుఁ జేరి గ్రక్కునన్. 119

తే. ఱొమ్ము గాఁడిన సౌమిత్రి దిమ్మ దిరిగి, పుట మెగసి కేలివిలుజాఱ బోర మోపఁ
బడఁగ శేషాంశ మైనయాభవ్యశీలు, ధరణి తలఁ దాల్చె మేలు కృతజ్ఞురాలు. 120

వ. ఇట్లు మూర్ఛావివశుం డై నేల వ్రాలియున్న యన్నరనాథకుమారుం గొనిపోవువాఁ డై వాసవారి తేరు డిగి యెత్తంబోయి తక్షుద్రక్షుకంబై విష్ణుతేజం బున్నకతంబునఁ గదలింపలేక విలాకుం డై తనలోన. 121

క. మును వెండికొండ తూఁచిన, తునుకోలగదా మదీయదోర్దండ మితం
డస నెంత యున్నిచేతులు, వెనువెనుకకె వచ్చె నెత్త వెక్కసపడుచున్. 122

ఉత్సాహము. అంచు నెంచుకొంచు నుండ ననిలజుఁడు తటాన నే
తెంచి తల తలంగు రోరి దిట్టకూళ ! యంచు గ
ద్దించి గ్రుద్ది యద్దురాత్ముఁ ద్రెళ్లఁద్రోచి లక్ష్మణుం
గొంచు నరిగి డించె భానుకులవరేణ్యు చెంగటన్. 123

క. నక్తంచరుఁడును రఘుపతి, భక్తుని గుద్దున ధరిత్రిపైఁ బడి పిదపన్
రక్తంబు గ్రక్కికొనియును విరక్తుఁడు గాకపుడు లేచి రథ మెక్కి వెసన్. 124

వ. బవరంబునకుం దివురు చుండె నట సుమిత్రాపుత్త్రునురంబు దూరినశక్తియు నతండు వైవశ్యమగ్నుండై యుండంజేసి తిరిగి పోయి రావణుం జేరె నప్పుడు. 125

## రామరావణయుద్ధము.

ఉ. తాదృగవస్థ నున్న తనతమ్మునిఁ జూచుచు దాయఁ జూచి యో
రా ! దనుజాధమాధమ ! దురాగతముల్ కొన కెక్కె నంచు సీ
తాదయితుండు కట్టలుకఁ దమ్మికనుంగవ యెఱ్ఱఁ జేసి బ్ర
హ్మాదులఁ జొచ్చినన్ విడుతునా ? యిఁక వీని వధింతుఁ గాకనిన్. 126

తే. అని పలికిన వీరసన్నాహ మలవరించి, హనుమదంసాధిరూఢుఁ డై యనికిఁ గదలె
రక్కసులఱేఁడు నెదురుగా రథము దోలె, నొగలువాహనకపిలోషల్ వగులఁ దాఁక.

వ. ఇత్తెఱంగున నొత్తరంబై జగత్తు లుత్తలపడ నొత్తి వచ్చిన యత్తేరిమ్రోలఁ గోస
లేశ్వరకుమారుండు. 128

క. అభ్రంకషరథకపి చిత్రభ్రమణంబుల వెలింగెఁ బ్రళయాంతక ఫా
లభ్రాజిష్ణుభ్రుకుటీ, విభ్రమ ధౌరేయ మైనవిల్లుం దానున్. 129

మానిని. రావణుఁ డేసె శరంబుల ఘోరతరంబుల నేరి తరంబులునుం
గా పవి తాఁకినఁ దాలుకొనం బెనఁగం బవికల్పము లల్పములం
బోపనిపాటివి పావనిచిల్లులువోవఁ జలింపఁ డతండును గ్రొం
బూవులతోఁ బొడవైతగుఁదాసనపుంబొదచందమునం బొలిచెన్. 130

సీ. దశరథాత్మజుఁడును దనదిట్టతత్తడి, నెత్తుట జొత్తిల్లి నెఱకుగాఁడ
నేయుట కలిగి కట్లెఱ్ఱచూపులఁ జూచి, యుడుపీథియురుల విల్లుఱుమఁ బెట్టి
విశిఖంబు లేయ విద్యుపదిషుత్రుటనంబు, లవి యమేయజ్వాల లలమఁ బొదివి
పగ భస్మ మయ్యె గట్టిగ నిప్పు డన సవా, హనసారథికముగా నరద మెరియఁ
తే. జేయ బూడిదప్రోవులై చిన్నవోయి, కానఁబడెఁ గంటె నిశ్శేషగళితతప్త
దశమకుటకాంచనద్రవధార లున్న, తనువుతో రిత్తతలలతో దనుజరాజు. 131

క. ఇలు కాలి కూల నిట్టక, నిలిచిన నిట్రాడువోలె నిజరథ మటులం
బొలియ న్నిలఁబడి రాకా, సుల కేఁ డుండుటకు నగుమఁ జూచిరి వేల్పుల్. 132

వ. కౌసల్యాకుమారుండునుం బంక్తిముఖుని వీక్షించి. 133

## రాముఁడు యుద్ధశ్రాంతుఁ డగురావణుని లంకకుఁ బుచ్చుట.

క. ఎఱకలు నఱికినఁ గొమ్ములు, వెఱికినఁ బోలేనిగిరిని బెగడినకరి ని
త్తఱిఁ దలఁపించెదు తేజం, బఱి యింత యవస్థ వచ్చెనా నీ ? కకటా !. 134

చ. అధియుఁడు గాక గంధకరియాకృతి రేపటిఁ బట్టి యెక్కటిం
గద కపిరాట్సమూకదళికావనవాటిఁ బెకల్చి యాడి తిం
తదడవుదాఁక దూఁపటిలినాఁడవు కయ్యముసేయ నెల్లి వ
చ్చెద విపు డేమి దప్పె ? నిలుచేరి సుఖంబున నుండు నేఁటికిన్. 135

## లక్ష్మణుఁడు మూర్ఛఁ దేరుట.

వ. పుత్త్రమిత్త్రకళత్త్రాదులతో విభవానుభవంబున నున్న నిన్ను నీయధర్మంబె దరిద్రొక్కిం
చెంగదా యని యానతిచ్చి తద్దయానిధి యతనిం బొమ్మని యనిచి హనుమదంసావతరణం
బొనర్చి వెంచేసి యనుజునిం దేర్చినఁ బౌలస్త్యుండును నచట నుండక చనుచో వన
చరులు తన్ను వెన్నుదగిలి దుమ్ముతోలించి చల్లువారును జప్పట్లఁ జఱచువారును నడ్డం
బరిగి వెక్కిరించువారును లై చేరిచేరి కేరికేరి నవ్వ నందఱం జేవిసరులం జెదరం జేయు
చుం బరాభవఖిన్నుండును దయాపన్నుండును నై వేఱొక్కతే రెక్కి పురంబు
చొరంబఱచి తననగరివాకిట నరదంబు డిగ్గి యాప్తపరివృతుం డై పోయి యేకాంత

మంటపంబునం గూర్చుండి కొండొకసేపు చింతించి కుంభకర్ణుం డుండఁ గుఱుకుర విచారణంబులేల? యని యతని లేపికొని తెండని యనిచిన ననేకులు యూపాక్షాదులు భక్ష్యభోజ్యాదులు పట్టించుకొని చని దివ్యమణిమరీచివిస్తారితతటిద్వారం బైనతదీయ శయనగుహాద్వారంబుఁ జొచ్చి పోవంబోవ. 136

## రాక్షసులు కుంభకర్ణుని నిద్ర లేపుట.

సీ. తాత్కాలికతదీయఫూత్కారమారుతం, బెత్తి వైచినఁ దూలి యెల్లవారు
వచ్చి వాఁకిటఁ బడి వక్షంబు పగిలిన, వాఁడుఁ గేలిలికిన వాఁడుఁ గాలి
కీలుదొలంగ మొగ్గినవాఁడు మొనముక్కు, చెక్కుఁబోయినవాఁడుఁ బ్రక్కయెముక
మురిసినవాఁడును మొగము దోఁగినవాఁడు, నై నొచ్చి యల్లన నలవు దేఱి
తే. గహ్వరముఁ గ్రమ్మఱఁగఁ జొచ్చి కడలఁ దప్పఁ, దెరువు లిడికొని తలయంపిదెసకుఁ జేరి
యనిఁ గపులఁ దారుజావ నేట్లాడునంత, లేసి బాలెత్తి వేసియు లేపలేక. 137
ఆ. ముక్కుఁ జెవులు నోరు మువ్వేవు రసురల, నూర్చు వెడలకుండ నెత్తిపట్టఁ
బనిచి కడుపుమీఁద బండులు దోలించి, రిటులు దోలఁగా నొకింతదెలిసి. 138
వ. కనువిచ్చి చూచి లేచిన వానికిం బొట్టనిండఁ దిండివెట్టి వేయికడవల కారనుపోతుల నల్లకలిపినకల్లు దప్పికి నిచ్చి తృప్తునిం జేసిన నతం డతిమాత్రవిపులవృత్తారుణతారకం బులు ఘూర్ణమానంబులుగాఁ గదలి గవి గ్రక్కదల హుంకరింపుచుం దనులేపిన పని తెలుంగు యూపాక్షాదులచే విని వెడలి విపణివీథి నేతేర నాతని పొడవు కోట లోపలి బలీముఖులు గనుంగొని కనుకనిం బఱవం దొడంగి రిట్లు కుంభకర్ణుం డన్న కొలువునకు వచ్చి యతనికిం బ్రణమిల్లి దేవా! నన్నుఁ దెలివితెమ్ముట యెందులకు నానతిమ్ము. 139

## కుంభకర్ణుఁడు రావణానుజ్ఞాతుఁ డై యుద్ధమునకు వెడలుట.

క. నాకముఁ గూల్చుటకో ? భూ, లోకముఁ గాల్చుటకొ ? యురగలోకము నీకుం
గైకొల్పుటకొ ? నాకు న్నాకొల్పెడుకోఁతిపోరు వాక్రువ్వకుమీ. 140
వ. అనవుడు మనగఖేదంబు మఱచి మందోదరీమనోరథుండు. 141
క. నాచేసికొనిన నేరమి, నీచేతుల మఱుఁగుఁ జొచ్చి నీఁగెదఁ గృపనా
రాచానలకృతవేదనఁ, బాచె న్నవదీయవచనభంగులు నాకున్. 142
వ. మకుటంబులును మరల మస్తకంబులకు వచ్చినయవియు మత్కృతంబులెల్లఁ జెల్లించె దవుగాక నీవేమి విభీషణుండవే విడిచిపోవుటకు? నని యంతయు సూచించిన విని యతండు కటకటంబడి పాకశాసనప్రముఖప్రతీక్ష్యసేనావసరుండ వై యుండు నీకా యీకాఱియ? రావణేశ్వరా ! నానిదురగదా యింతకుం దెచ్చెఁ దెచ్చుం గాక తజ్ఞా

ద్యంబు భవత్ప్రేషితులచేతం గొంత దీఱెం గడమం గపులు దీర్చెదరు తదీయ భుజాపర్వతపాదపాదిపాతంబులచే లెస్స మేలు గాంచినపుడు నీవు నిర్బంధాపాది యైన పగ మామకజఠరానలంబున జీర్ణం బయ్యె నని నమ్ము ముమ్మలికంబు విడువు మని పలికి యగ్రజానుజ్ఞాతుం డై కదలి పురంబు వెడలివచ్చు వానిం జూచి రఘువీరుండు విభీషణుం బిలిచి వీఁ డెవ్వండు వియద్వ్యాలయపటకుటీరంబునకుం జాలినయొంటికంబంబు వలె నున్నవాఁ డని పల్కిన దేవా! యితండు కుంభకర్ణుండు దశముఖుని డాసినవాఁడు దీర్ఘదేహుండు పుట్టినప్పుడ పొట్టచిచ్చునకునై జగదఖిలజంతుక్షయం బొనర్ప నేర్పడిన నదుర్పడి పురుహూతుండు చేతివజ్రాయుధంబున వైవ నది యొమ్మున నొడ్డి వమ్ముపోవం జేసి చౌదంతికొమ్ములు గురుసులకు విఱిచి దానం గొని వైచి యవ్వాసవుం దఱిమెం బ్రపంచపరితాపం బొనరించి బ్రహ్మశాపంబు గాంచె దానం జేసి యితండు నిద్రించుట కాఱునెల లాహారవిహారంబులు గాంచుటకు దినద్వయంబును నై యుండు నిన్నిద్రాళువు మితినిండక మేల్కన్నం జెడు ననియుం బరమేష్ఠియై పలికినాఁడు నేఁడు బలాత్కారంబున లేపి పంచినం జనుదెంచి నాఁడని విభీషణుండు విన్నవింప విభుండు వెఱఁగంది చూచుచుండె నంత. 143

## కుంభకర్ణయుద్ధము.

సీ. కదియ ముట్టినకుంభకర్ణునిపైఁ గపుల్, సంఫుల్లభూరిభూజములు వైవ
నతనివక్షఃపీఠి నవి చూర్ణమై మరం, దరసంబు జిగటమై విరులు నిలిచి
పూవుగట్టున గందవొడివోలెఁ బరిమళ, భరితమై నెఱయ వా రరిది యనుచు
గట్టెత్తి వైవ మోఁకాళ్ల మోఁచేతులఁ, దుమురుగాఁ దట్టుచు దూఱి యతఁడు
ఆ. వైచుకొనఁగఁ జొచ్చె వదనబిలంబులో, నరక యొడిసి యొడిసి యూథపతులఁ
గాయభీరువులు దదీయకర్ణఘ్రాణ, వివరమార్గములను వెడల వెడల. 144

వ. ఇది గాదని యయ్యఖిలభీకరుండు దండుమీఁదం బడి పది నూఱు వేయి మొదలైన లెక్కలతో నెక్కువతక్కువం జిక్కినకొలంది కపులం గరంబులం జమిరి పిసికి ముద్దలు చేసి సవ్యాపసవ్యంబుల వైచుకొని మ్రింగం దొడంగిన ముంగలిమూఁకలు వెఱచఱచి పఱచినం గని కనలి యనిలతనయాంగదగవయద్వివిదశరభశతబలిగజగవాక్షాదివృక్షచరశ్రేష్ఠులు భూయిష్ఠమాత్సర్యంబులం బైకి లంఘించిన జంఘాజానుజఘనభాగంబులను వీఁపుల మూపులం జాఁపుచేతులం జెవులం జెక్కుల ముక్కుమీఁదనుం గలయఁ బ్రాఁకిన నతండు గొండొకవడి నిండువనంబు తోడికొండవోలె 'పవంపడి యొడలు జాళించి తూలించినం జాలించక ముంచుకొని ముందఱం బిఱిందిపంకను వలపలం దాపలం బోనీక పాదివిన నుఱికి పిడికిటం బొడిచియుం దిరిగి మోచేతులం గ్రుమ్మియు నొరగి యూరతన్నులు తన్నియు నఱచేతం బఱచియుఁ బెడచేత నడిచియు నంసఱం దూఁగి

యాడం జేసినం గని యోసరింపక వానరరాజకుమారుండు మాఱుకొని యొకటిం గొని నం గినిసి నిశిధినీచరుం డద్దండిదొరయురంబు శూలంబునం బొడిచి వెల్లకిలం ద్రోచినం బోయెఁబోయెం దీఱెఁదీఱెం బని యని వనచరసేన దీనాననయై పెదవులు దడుపుచు నుండె రక్కసుం డక్కపిరాజు చచ్చెనే యని తమకోనికిం గానుక వట్టువాఁడై కొని పురంబునకుం బోవుచు నుండె నాంజనేయుం డాచకితకపులతోఁ బతి మూర్ఛితుం డింతియు తేటి యచ్యుదోన్మత్తునువ్వెత్తున మోసపుచ్చి వచ్చుం జూచుచుండుండు వేఱొండు గారా దటులైన వీనిం గొట్టి విడిపించుకొనంజాలనే? విభుం డభిమాని తానే విడివడుంగాక యని యొప్పం జెప్పుచుండె నంత. 145

ఆ. కోటలోనఁ బోవుకుంభకర్ణునిమూపు, మీఁదివాఁడు దేటి మిహిరసుతుఁడు
లంక యిది వియత్తలం బిది నడుమ నా, యునికి యెందుమీఁద నొక్కొ యెఱుఁగ.

క. కయ్యంపువేళ గాదని, యయ్యెడఁ దలపోసి తెలిసి యైనర్థ మెట్లో
యయ్యో నగుంగా కిపుడీ, దయ్యమునకు బుద్ధి చెప్పి దాఁటెద ననుచున్. 147

ఆ. అసురభటులయార్పు లడుగువట్టి చనంగ, నతని చెవులు గూబ లంటఁ బెటికి
ముక్కు గొఱికికొని దుముక్కునఁ దనసేన, సరస కుఱికి రామచంద్రుఁ గాంచె. 148

ఆ. దశముఖానుజుండు దనకర్ణఘోణల, మ్రోల్లఁ గుమ్మరించు మదురు నెత్తు
రెల్లపొడవుఁ గడప నెఱసంజఁ బడమటి, మిన్ను వెలిఁగినట్లు మేను వెలుఁగ. 149

వ. గిరుక్కున మరలి వీడు వెడలి తనబ్రతుకుమీఁద నుమియుతెఱంగుదోఁప విలూనఘ్రాణగళితంబై వాతెఱను వచ్చు నెత్తురు తుప్పతుప్పన నుమియుచు వక్షోవీరపరివృతుండై కవిసినం గని కపులు తెంపుచేసి తనగుంపుమీఁదం బడిన నతం డాసందడికయ్యంబులోనఁ దనవారు వారివా రనక దొరికినవారి నెల్లం దునుకలు చేసి బొక్కుచుం ద్రొక్కుచు నెక్కడ నున్నవాఁడు విరాధవిరోధి? యనుచు వలకేల ముద్గరంబును డాకేల నొక్కతిరువునుం గైకొని డీకొని సౌమిత్రి యేయు నేటులు దనువాటిన గీటుగొనినపాటి గాక పోకకు నిక్కాకం బోక శాకాసిం దునుముతూపు కల్గునొకో! యని వేల్పులు వెక్కసపడి చూడం జేరువాడుచుం జేరంబోయి రఘువీరునితో ని ట్లనియె. 150

## రాముఁడు కుంభకర్ణుఁ జంపుట.

క. కలతూపు లేవి యేయుము, పలుగుట్టుం బుడక లివియె పార్థివ! నాకుం
బలుక్రోఁతులు దంష్ట్రాంతర, ములలోఁ జిక్కుకొని యూడిపో విదె యొపుడున్.

వ. అని పలుకునంత. 152

క. తరుముద్గరభరితతదు, ద్ధురతరసవ్యాపసవ్యదోర్దండములన్
ధరఁ గూల్చె రఘువరేణ్యుఁడు, మరున్మఘవదేవతాకమహితాస్త్రములన్. 153

వ. అక్కుఱుంగవ ప్రక్కం జిక్కి మక్కిన మర్కటులు రక్కసులు పెక్కండ్రు గల రదియట్లుండె సందిళ్ల గోలందులకుం దెగిన యమ్మోళ్లు రెండు నతం డార్చియెత్తినం జిల్లునం జిమ్మన గ్రోవులం బారుతీరున నెగయు రుధిరధార లూర్ధ్వలోకంబులం దడిపికొనుచుం బోయె నప్పు డప్పుడమి ఱేఁడు వైడందవాఁడితూపుల నతని కాళ్లు కత్తిరించి యయ్యుత్తరము నొత్తరముం గుఱుచపఱిచిన నవుడు గఱిచి హుంకరణభయంకరుం డై మ్రింగ నప్పళించు నద్దానవుండు. 154

క. తొంటినడ గుంటుపడినం, బంటుతనము గుంటుపడక పరుషధ్వనితో
మింటికి నిమ్ముగ నంగిటి, గుంటదనుక నోరుదెఱచికొని యున్ముఖుఁడై. 155

వ. జరిగి జరిగి గిరి గదలి వచ్చుగతి వచ్చునో నచ్చెరువంది పరేతరాజశర మరిందోసి యారా కాసి ఱేనిగళంబునకుం బూన్చి తెగనిండఁ దిగిచి జగతీవల్లభుం డేసె నంత. 156

మహాస్రగ్ధర. తెగి తన్మస్తంబు దంష్ట్రాద్రిగతధగధగ ద్దీప్తలిప్తాభ్రమై న
క్రగుహాగర్జావశేషోద్గగనచలితగంధర్వవిద్యాధరం బై
నగరప్రాకారకేళీనగశిఖరసరత్నస్ఫురచ్చంద్రశాలల్
పగులంగాఁ దాఁగి కొంచుం బలుపడిఁ జని తత్ప్రాంతపాథోధిఁ గూలెన్.

క నడు మొండె మదియు నతనిది, కడలిన్ సగము పడి యొకసగం బిలఁ బడ నం
దడవులఁ గొండలఁ గ్రోఁతుల, తుడుములఁ బెక్కొక్కపరియె తుత్తుము రయ్యెన్.

వ. అత్తఱిం బరమానందభరితులై దివ్యులు దుందుభులు మొరయింపుచుం బుష్పవర్షంబులు గురియించి జయజయశబ్దంబులతో రఘువీరుం బ్రశంసించిరి తప్పిపోకకుం దప్పి నిలిచినతరుచరులు తలలు పట్టి చూచుకొనిరి యంత నచ్చట రావణుండు నిజానుజవధప్రకారంబు హతశేషనిశాచరులు దెలుపక తొలుత నె యతనితల వీటికిం దాఁటిపోవుట చేత నెఱింగికొనియు. 159

## రావణుఁడు కుంభకర్ణుమరణమునకు శోకించుట.

క. వినమిన్ విచికిత్సాయుత, మనస్కుఁ డై యుండి యుండి మఱి వెనుకం దా
విని యున్ విచికిత్సాయుత, మనస్కుఁ డై యుండె నురక మ్రాన్పాటొదవన్. 160

వ. వెండియు నతండు తమ్ముని దలంచి తలంచి యెలుంగెత్తి పిలుచుచుం దజ్జయంబు లుగ్గడింపుచు హా! యనుచు నేలం బుడుకుచుఁ బొరలుచుఁ బెక్కువగలం బలవించుచుఁ దనతోడంగూడఁ బుత్త్రమిత్త్రకళత్త్రాదు లడలి యడలి తమంతన తాలిమిఁ దెచ్చుకొని తనుం దెలుపం జొచ్చినం దేఱ నేరక యూరక పొగులుచు విభీషణునీతివినక చెడితిం గా యనియుం బుద్ధిచెప్పిన ప్రహస్తుని ప్రాణంబులు గొంటిం గా యనియుఁ గడపట నీలావు నమ్మితిఁ గా తమ్ముఁడా! యనియును వాపోవుచున్నం జేర వచ్చి త్రిశిరుండు దేవ!

నీవంటిమానధనున కిది పాటియే ? యొప్పనివారు నవ్వ ని న్నెతలు తలపోసికొనం
బాడియె ? నీ కెదు రెవ్వండు ?. 161

సీ. విధివితీర్ణం బైన విశిఖంబు విఱిగెనే, దొనఁ దొంగి చూడుమా దనుజనాథ !
విశ్వంబు నేఁడు నీవింటికి వెఱవదే ?, రాముఁ డెక్కడివాఁడు రాక్షసేంద్ర ?
కుంభకర్ణునితోడఁ గులమెల్లఁ గ్రుంగెనే ?, యరుల కేమోపమే యసురరాజ !
యతికాయదేవనరాంతకుల్, చిఱుతలే ?, యంపుమా నాకుఁ దో డాసురేశ !

ఆ. యనిన వారు నట్ల యగు మాకు సెలవిమ్ము, దేవ! యనిన సమ్మతించి యతఁడు
చనుఁడు మీకు సమరమున మహోదరమహా, పార్శ్వ లెట్టుఁ దోడుపడెడువారు. 162

## మహోదరాదులు హనుమదాదులచేఁ జచ్చుట.

చ. అని యనుపన్ మహోదరుఁడు హస్తిహయంబు నరాంతకుండున
న్న నలుఁవురుం బ్రభావపరిణద్ధరథంబుల నెక్కి సేనలం
గొని బహుతూర్యముల్ మొరయఁ గొల్లఁగొనం జనువై ఖరిం జనన్
వనచరు లాజిఁ బీనుఁగుల వట్టుగఁ జంపిరి తద్బలంబులన్. 163

ఆ. అంతఁ ద్రిశిరోతికాయన, రాంతక దేవాంతకులు మహాపార్శ్వఁడు దు
ర్దాంతుఁ డగుమహోదరుఁడు ది, గంతప్రకటాట్టహాసులై పైఁ బడినన్. 164

సీ. అరదాలతోఁ గూల్చె నిరుగాలఁ దన్ని దే, వాంతక త్రిశిరుల ననిలసుతుఁడు
తత్తడితో నెత్తి తలక్రిందుగా వైచి, యని నరాంతకుఁ దీర్చె నంగదుండు
కరటితో సరిపెట్టెఁ గటికి కాఁగిట నుగ్గ, నదిమి మహోదరు నగ్నిసుతుఁడు
సారథితో వ్రేసి చంపె మహాపార్శ్వ, దానవు వృషభాఖ్యవానరుండు

తే. నప్పు డతికాయుఁ డౌరౌర! యద్రిచరులు, జమిలి చంపులు చంపి రిచ్చట నటంచుఁ
దచ్చమూమధ్యమునకు రథంబు దూఱ, నూకి పాపట పుచ్చి లో నుసలఁ జొచ్చె. 165

## లక్ష్మణుఁ డతికాయుం జంపుట.

క. ఇరుఁగెలఁకుల కపులుం దన, శరములనో డెలునడంగఁ జనియెన్ సమరో
ద్ధురుఁ డట యేఁడీ రఘువరుఁ?, డరుదేరుఁడు చూడుఁ డేయుఁ డనుచుం బెలుచన్.

క. ఇటులఁ జనఁ దత్పరాక్రమ, పటుత్వ మీక్షించి రామభద్రుఁడు విల్లం
దుటయును లక్ష్మణుఁ డాయన, నటు నిలు మని మ్రొక్కి వాని కడ్డము దాఁకెన్.

ఉ. తాఁకినఁ జూచి వాఁ డతనిఁ దారసిలంగ రథంబు దోలి నీ
యాఁకకు నిల్వ దీయరద మన్నఁ బిఱిందికిఁ బోవఁగా నొగల్
దాఁకెడు దేవదంతిఁ బడఁదాఁకె దురంబునఁ దొల్లి నావుడున్
వ్రేఁకపునారసంబుల హరించె నతండు శతాంగవేగమున్. 168

వ. అప్పు డతికాయుండు. 169

చ. సునిశితనిష్ఠురం బయినసోనధనుర్జనితంబుగా నొన
ర్చిన నది ముంచె ముంచుటయు సీతమఱంది సమీరసాయకం
బున నెడలించి యట్టిశరము ల్నిగిడించినఁ దుర్గమం గనం
గనగనమన్విధాతృవిశిఖంబునఁ ద్రెంచెఁ దదీయమస్తమున్. 170

## ఇంద్రజిత్తుమాయాయుద్ధమున వానర వీరులు మూర్ఛిల్లుట.

క. తద్వార్తాకర్ణన మపు, డుద్వేగము వెనుప వచ్చు నూర్చి నముచిభి
ద్విద్వేషి యనికిఁ ద్రిదివా, పద్వర్ధను మేఘనాదుఁ బయనముచేసెన్. 171

వ. అంత. 172

శా. దిక్కుల్ పుక్కిటఁ బట్టఁగాఁ బ్రబలహాదిత్రధ్వనుల్ సైన్యముల్
పెక్కుల్ గొల్వఁ గదాశకంఠి బిరుదుం జేర్వాడుచుం బోయి తాఁ
దక్కం దక్కినమూఁక నెల్లఁ గపియుద్ధక్షోణిఁ గోల్పోయి యా
చక్కి న్నిల్వక మిన్ను చొచ్చికొని గర్జాఘూర్ణితాజాండుఁడై. 173

అమ్ములు బ్రహ్మమంత్రాభిమంత్రితములు, మిను గ్రక్కనివిపించి మునుఁగఁ గురియ
గజ గంధమాదన గవయ గవాక్ష కే, సరి నీల శతబలి శరభ రంభు
లాదిగా యూథపు లర్వదియేడుకో,టులు దేవతాసంభవులు బలంబు
తోఁ జచ్చి రినజాంగదులు గతాసువు లైరి, రామలక్ష్మణులు మూర్ఛల మునింగి

తే. రంత రవి గ్రుంకె మరలె మాయావి బ్రహ్మ, జపముచే హనుమద్విభీషణులు దేఱి
విపదపాయంబు దలఁగింప వెరవెఱుంగ, కజసుతుని జాంబవంతుని నడుగఁ జనిరి. 174

## హనుమంతుఁడు సంజీవకరణిచే నందఱఁ బ్రతికించుట.

తే. అతఁడు గొఱప్రాణముననుండి హరువుదెరువు, లావటిలఁదెల్పఁ జని వాయుదేవసుతుఁడు
క్షీరవారాకరోత్తరతీరభూమి, నుండు దివ్యౌషధంబులఁ గొండఁ దెచ్చె. 175

సీ. తెచ్చినప్పుడ దాన దీపించునోషధీ, లతలగాడ్పులు సోఁక హతజనంబు
లగ్నశల్యము లూడి భగ్నసంధులు గూడి, మిసమిస పస లెచ్చి యసులువచ్చి
దొరలెల్ల దాశరథులతోడనే లేవ, గట్టుతం డచటనె పెట్టివచ్చె
సూర్యోదయం బయ్యె సురలాదిగా నెల్ల, వారుఁ జేరొక్కనిరి సామీరిమహిమ

తే. తిరుగ రే రాకఁ గోరుచుండిరి ప్లవంగ, వీరు లంతట రవి గ్రుంకె వెలిఁగెఁ దార
లిరులు నిండె సురారివీ డెరియఁ బెట్టి, రయ్యనర్గళభుజశౌర్యు లార్చి చొచ్చి. 176

తే. ఇట్టివానరపరివార మేసరేఁగి, వైచుచిచ్చుల లంక యేవంకఁ గనిన
గోడమన్నింటికొయ్యయుఁ గోటరాయి, మొదలుగా గాలనది పంక్తిముఖుఁడుచూచి,

### సుగ్రీవహనుమంతులచేఁ గుంభనికుంభులు చచ్చుట.

మ. అనిచెన్ గుంభనికుంభులం గపులతో నాలంబు చేయం బ్రజం
ఘుని యూపాక్షుని శోణితాక్షు మకరాక్షుం గంపనుం గూర్చి వా
రును దూర్యంబులు మ్రోయ సైన్యములుఁ దారుం దాఁకి యంతఃప్రవి
ష్టనటద్వానరసేన వెల్వఱచి వెంటంబెట్టి బెట్టార్చినన్. 178

వ. సుగ్రీవాంగదాంజనేయమైందద్వివిదులు వివిధవీరాలాపవిజ్ఞాపితనిజాభిధానులై యుద్ధంబు సొచ్చి రంతఁ గుంభుండు జంభారిసుతసోదరుం దాఁకి వీఁకల బెనంగిపెనంగి యాతని పిడికిలి పిడుగువడినం గణత పగిలి చచ్చె నికుంభుం డంభోరాశిలంఘనవిక్రమఖ్యాతజంఘాలుం గదిసి తదసిప్రాయనఖరముఖవిదారితవక్షఃకుక్షియై నేలం గూలె నకంపనప్రజంఘు లంగదుం గని మార్కొని యతనియంఘ్రిప్రహారంబున నుపహారంబులైరి యూపాక్షశోణితాక్షులు మైందద్వివిదులను లివ యుడంగుపాటిగాఁ బోరి వారికిం బేరలుక దెచ్చి తచ్చపేటంబులకుఁ బ్రాణంబు లిచ్చి రంత నత్యంతకోపాటోపంబున వచ్చి మకరాక్షుం డక్షీణబాణపరంపరాపరాభూతవానరవీరుండై మాఱులేక యొక్కఁడుఁ జూచినం దానయై యున్నం గనుంగొని ఖరవిరోధి వానిపురోవీథి న్నిలువక తన వెనుకను వచ్చు యూథనాథుల కభయం బిచ్చి విలుపుచ్చుకొని టంకారంబున నద్దనుజవీరుం జేరం జీరి సమీరసఖసాయకంబునం దేరుతోడన నీఱు గావించె నంత సూర్యోదయం బయ్యె నయ్యవసరంబున. 179

### ఇంద్రజిత్తు నికుంభిలాహోమము సేయుట.

సీ. వెండియు మేఘనాదుండు తండ్రికి నేఁడ, పగ దీర్తు నని పెక్కుబాస లిచ్చి
సన్నద్ధుఁడై వచ్చి సకలయూథపులను, నృపులనుఁ బాడకట్టి నిమిషమునను
మినుదాఁటి తేరితోడ నదృశ్యుఁడై యేయఁ, జొచ్చి రాముని కల్కఁ దెచ్చి యతని
దివ్యాస్త్రముల మాయ తెగి యాకసము దొంకి, యరద మందఱుఁ జూడ నవనిఁ బడిన
ఆ. వెఱచి పఱవఁ గపులు వెన్నాడఁ సుహనాము, హీజ నొర్తు వారియెదుటఁ జంపి
శోకమగ్నమానసులఁ జేసి వ్రేల్మిక్కి, నతఁడు చనె నికుంభిలాటవికిని. 180

వ. పావనిముఖు లగువలీముఖు లద్దాశముఖి యెటుపోవుటయు నెఱుంగక జానకిం జంపెనే యనుచు నడలుచుం జని విన్నవించినఁ బలవించుకాకుత్స్థులం గనుంగొని విభీషణుం డిది మేఘనాదుని మాయ వాఁడు మాయారణహోమంబునకుఁ జనినవాఁ డిది నిక్కువం బది విఘ్నంబు చేసి యిప్పు డప్పగతుం బరిమార్చుట నీతి యనినం దేఱి జానకీవిభుండును నవ్విభీషణహనుమజ్జాంబవదాదులం గూర్చి వానిమీఁదికి సౌమిత్రిం బనిచె నంత. 181

### లక్ష్మణుఁ డింద్రజిత్తు వధించుట.

మ. అతఁడుం బోయి నికుంభిలాటవినిశాటానీకినీరక్షుఁడై
హుతభుక్సన్నిధి ముక్కుపట్టుకొని కూర్చున్నట్టి యయ్యింద్రజి
ద్దితిజుం బోరికిఁ జీరి చంపి మరలెన్ దేవేంద్రుఁ డుప్పొంగ న
స్కృత లెల్ల న్నవని పంక్తికంఠుఁ డడలల్కం బెంచె నుద్వేలుఁడై. 182

### రావణుఁడు మరల యుద్ధమున కేతెంచుట.

చ. వెనుక నృపాలురం గపులవేలముచొచ్చి వధింతు మన్న యా
జ్జనకజఁ ద్రుంతుఁ గా కదియె చంపె ననేకుల నం చశోకకా
ననమునకై కఠోరగమనంబునఁ బోవ సుపార్శ్వుఁ డాదిగా
ననుఁ గులు మాన్పగా మరలి యాజికి వెల్వడెఁ బెక్కురీవులన్. 183

తే. వెడలి యసురాధినాథుండు కొడుకుతోన, తెగెనొకో దీమసం బనఁ దేరు డిగ్గి
యెల్లపరివారమునకుఁ జేయెత్తి మ్రొక్కి, నడుపుఁ డీవేళ యిది సుండి నాకు మీరు.

మ. అనిన న్మంత్రులు నాప్తులున్ దొరలు దేవా! మ్రాకులన్ రాలఁ దే
ర నె యెంతే నలనడ్డయానిమితకాండ్రన్ భానుపుత్త్రాదులన్
వినుమీ చంపక పట్టి తెచ్చి దినము న్నీయింటి కామాటపుం
బనికిం జొచ్చెద మన్న దాఁక నిదె చెంపల్ వ్రేతు మత్యుద్ధతిన్. 185

వ. మీరు తేరెక్కి యిటు విచ్చేసి కనుంగొనుం డనవుడు నుత్సాహంబుతో నతం డట్ల యాచరించె నద్దానవవీరులును భీకరాకారులై తేరులు వారణంబులు వారువంబులు ఘోరమృగంబులుం దమకు వాహనంబులు గాఁ గొని నానావిధతూర్యంబులు మ్రోయఁ దలకడచి నడచినం గపిసేనలుం గలియఁబడియె నప్పుడు. 186

చ. శిలలను గుప్పుచప్పుడును జేతుల హేతులు త్రిప్పుచప్పుడున్
దెలుపుడు దెల్పుచప్పుడును దేరులు నూరెల రొప్పుచప్పుడుం
బలములఁ ద్రిప్పుచప్పుడులు బర్వఁగ నజ్జగడంబు మజ్జగం
బులు వినియెన్ నిశాచరచమూజితు లైరి ప్లవంగసైనికుల్. 187

క. విఱిగినకపులం గనుఁగొని, వెఱవకుఁ డని విల్లు పూని విభుఁ డిది యనికిన్
దఱి యని గంధర్వాస్త్రం, బఱిముఱి నరిఁబోసి యేసె నసురులమీఁదన్. 188

వ. ఏసిన నద్దివ్యాస్త్రమహిమంబున. 189

సీ. ముంగల వెనుకవంకం గెలంకుల నిండి, తొడిగినమ్ములతోన కడిఁదివిండ్లు
తెగలు నిండారంగఁ దిగిచి ప్రత్యాలీఢ, పాదులై తముఁ జుట్టు వాఱుకొనుచు
రాము లనేకు లారణవీథిఁ దోఁచిన, దితిజవీరులు వారిఁ దేఱిచూడ
నలికిమీఁదులు చూడ నందు నొదలలను, విశిఖంబు లానించి విడువఁ జూచు

తే. రాఘవసహస్రములఁ జూచి రాఘవేంద్ర!, కావవే? యంచు నెప్పలు గదియమూయ
నుల్లములలోనఁ బొడకట్టె భల్లభరిత, గురుధనుర్భాసి కాకుత్స్థకోటు లపుడు. 190

క. ముంగల వెనుకఁ గెలంకుల, నుం గనఁబడురాములం గనుంగొన వెలుపై
నింగిఁ గన నందు నెత్తుల, నుం గోలలు వంచు రామకోటుల తోఁచన్. 191

వ. ఇక్కరణి రక్కసులం గక్కసవెట్టి యక్కాకుత్స్థుం డొక్కఘటికాచతుష్టయం
బున ధనుష్టంకారఘోరంబుగా శరాసారంబు నిగిడించిన. 192

క. పదివేలు పసిఁడితేరులు, పదునాలుగువేల్గుఱ్ఱాలు భద్రగజంబుల్
పదునెనిమిదివేలుఁ గామే, లుదారరల్ పండ్రెండు లక్షలుం బొడిసైయెనన్. 193

మ. కని పౌలస్త్యుఁడు వాహినీపతనశోకక్రుద్ధుఁడై హవ్యవా
హనకుండంబులువోలె విష్వగను డోలాభీలకీలస్ఫులిం
గనికాయంబులు గ్రాయ బోరన శతాంగంబుం జోరం దోలి రా
మునికిం దూఱ విభీషణుండు గదచే ముంచెన్ హయల్ గూలఁగన్. 194

వ. ఇత్తెఱంగున. 195

ఆ. తేరు గుంటుపడిచి దిగ్గన వెనుకను, దాఁటె దాఁటు తమ్ము దాయఁ జూచి
దశముఖుండు క్రోధదంసహ్యమానమా, నసము వేఁడి వెలికి పిసరఁ బలికె. 196

మ. తులువా! నన్నెదిరించ వచ్చితివె శత్రుం డేఁడి నీకంటె ? నా
కలమర్మంబులు పేఁటెఁ బుచ్చి తడియుంగా కయ్యరాతిన్ నిరుం
భిలకుం దోకొని పోయితే కొడుకుఁ జంపింపంగ నవ్వేల్పులోఁ ?
జల మీడేలనె యెంతచేసితివి ? వంశద్రోహి ! ని న్నోర్తునే ?. 197

సీ. అని పల్కి యొకశక్తిఁ గొని యభిమంత్రించి, వ్రేయ విభీషణువెనుక కొత్తి
తా దాని కభిముఖుండై దీప్తబాణంబు, లేసె సౌమిత్రి యయ్యిషుపరంప
రల లెక్కగొన కక్కరాళశక్తి వెలింగి, గగనభస్మము రేఁగఁ గలయమలయు
పరుషకీలలతోడఁ బఱతెంచి యురమాన, గిర గిరఁ గను గ్రుడ్లు దిరుగ నతఁడు
తే. వ్రాలి మూర్ఛిలె హాహావిరావ మొదవెఁ, గపులలోఁ దమ్మునియవస్థగనియు విభుఁడు
ధైర్యధుర్యత విలుపూని దాయమీఁద, నడిచి నోనేసి వానిఁ బో నడఁచి వచ్చె. 198

తే. వచ్చి తనచేతివిల్లటు వైచి నేలఁ, జదికిలంబడి యొండినపెదవు లంట
వాడునాలుకఁ ద్రిప్పుచు వనరువిభుని, జేరి యూఱార్పఁ దలఁచి సుషేణుఁ డనియె.

వ. స్వామీ! సౌమిత్రి కేమియు భయంబు గారాదు మనకు మారుతి గలండు తేఁగలండు
సూర్యాస్తమయంబు గావచ్చె నింక నోషధులు వలింగి కతుపట్టు నని పల్కు
పల్కులు కడనుండి విని యాంజనేయుండు. 200

క. ఇనుఁ డస్తమింపఁ జయ్యనఁ, జని యౌషధనగముఁ దెచ్చి సౌమిత్రి సజీ
వుని జేసి కొండ మును పుం, డినచోట నిడించి వచ్చె నృపుఁడున్ మెచ్చన్. 201
ఉ. కోమలధాముఁడై పొడుపుఁగొండ కినుండు కిరీట మయ్యె సు
త్రాముఁడు పెట్టిపంచినరథంబున రాముఁడు దేజరిల్లె సం
గ్రామము గోరి సన్నహనగర్వముతోఁ బురి నిర్గమించె భే
రీముఖతూర్యఘోషబధిరీభవదాశుఁడు రాక్షసేశుఁడున్. 202

## రామ రావణ యుద్ధము.

వ. అప్పుడు సంగరదిదృక్షం జనుదెంచి యంబరంబునం బట్టు చాలక తొట్టియున్న కిన్నర
కింపురుష గంధర్వ సిద్ధ విద్యాధర చారణ సుర గరుడ సందోహంబు సన్నాహ
సాహససముత్సాహాభిరామభీముం డై రాము నెదుర్కొనంబోవు రావణుం గలహా
శనమునికిం గరంబులం జూపి. 203

భుజంగప్రయాతము. త్రిలోకీవనీసంచరిష్ణుం ద్రికూటా
ద్రిలంకాగుహాకేసరిన్ వీనిఁ జంపన్
వెలుంగొందె మున్నీటివేడెంబులోనన్
బళీ! రాముఁ డంచుం బ్రభావంబు లెంచున్. 204

ఉ. ఆదశకంఠుఁడుం దెలివి నంతట సారథిఁ జూచి కుంభక
ర్ణాదులు దోడులేమి కెటు లయ్యెదునో యనుచింత మానుమీ
యేదొర తోడువట్టి యెదురత్తఁగ నెత్తితి వెండికొండ నా
కీదుర మెంత? నీవెరవు లేమఱి కెక్కు మటంచుఁ జేరఁగన్. 205

చ. మనుకులసార్వభౌమునకు మాతలి చేతులు మోడ్చి దేవ! యి
ద్దనుజునివింటిచేయి బెడిదంబుసుమీ జతిసంబు సూరలం
గనుఁగొనుమయ్యా! వానరులఁ గాల్చుచు వచ్చె శరంబు లొక్కరుం
డన యల దెంద కెంద కెగు రందఱకున్ బరు వీతఁ డాజులన్. 206

తే. పెక్కడలఁ జూచి యెఱుఁగుదు నిక్క మనిన, నగవుమొలకమొగంబున నిగుడ దేర
మాతలికిఁ బ్రత్యయకరంబు నాతనికి దు, రత్యయతరంబుఁగాఁ గార్ముకారవంబు. 207
వ. రఘువీరుండు. 208

క. ఇషువర్షద్విషభద్రం, కషగర్వాగమనమునకుఁ గనలు గదిరి దు
ర్విషహవిషానలభీషణ, పృషత్కముఖములకు సెలవు పెట్టుచు నేసెన్. 209

చ. అవి నిజబాణదాహకము లైన దశాననుఁ డల్గి యుగ్రతా
పు వెలుఁగఁ జేసెఁ జేసిన నభోవపురుగ్రలలాటదృష్టి అ

ప్ప విఱుగఁ ద్రోచి లేచె నన బాణముమంట మొగుళ్ల ముట్టి గ
ర్భవిషము దీర్చి యేర్చి పయి భస్మము రాల్చుచు సేన నంటఁగన్. 210

శా. పర్జన్యాస్త్రము రాముఁ డేయుటయుఁ బైపైఁ బట్టి మబ్బుల్ గడున్
గర్జిల్లెన్ దనుజాస్త్రవహ్నితటిదంతర్యాతముం జేసి వి
స్ఫూర్జద్ధూర్భరిజటు న్నటుం గఠినహాసున్ భైరవుంబోలు మే
లార్జించెన్ బిడుగుల్ పడెన్ బిదపఁ దోయంబుం బ్రవర్షింపఁగన్. 211

వ. అంత. 212

క. కీలిశర మాఱిపోయినఁ, గాలోరగశరము పంక్తికంఠుఁడు పఱపెన్
వ్యాళమయ మగుచు మినుగై, వ్రాలెన్ బ్రాణములమీఁద వచ్చెన్ విధికిన్. 213

తే. నల్లత్రాఁచులు మేనుల నెల్లనిండఁ, బిగిలికొని వానరులసోఁక మొగులుఁ దీవ
లలమిన సుమేరుశృంగంబు లట్లయుండి, రేసె సౌపర్ణబాణంబు రాసుతుండు. 214

వ. అప్పుడు. 215

క. అట్టియెడ నెన్నియేనిన్, బుట్టెన్ వెన్నునిగుఱాలు భూమియు నభమున్
ముట్టెన్ దొట్టెన్ గడకున్, బట్టెన్ ఘూత్కారఘోరఫణభృద్గణమున్. 216

క. ఒకకడఁ బులుగులదొర యొఱు, వొకకడఁ బెనుపాపనలువు నొదవిన నుడువీ
థికిఁ బగ లొకకడనున్ రే, యొకకడనుంగలసురాద్రి యొరవు లభించెన్. 217

వ. వెండియుఁ బ్రచండపక్షవిక్షేపవాతోద్ధూతవారాకరతరంగం బగునవ్విహంగపుంగవ
గణంబు తత్ఫణాఘరనికరంబుమీఁదం గదిసి ఱెక్కలు విసరిన బొక్కలు దూఱి
పాతాళంబు పట్టి చన నడుమ నెడం జెదరి తదీయశిరోరత్నంబులు రఘువరునియకెలం
కులం దొరుఁగు తనవిభునియస్త్రవిద్యాపరిపాటికిం గనుచాటు దాఁకకుండ నీరాజనం
బిచ్చి కడలవైచుదీపకళికల పోలుపు దాల్చె నంత. 218

క. పలచుట్టి వీడుకొనుచుం, బులుఁగుదొరల్ విభునిఁ బొగడి పోవ నసుర గ
ర్జిలి యేసెఁ దామసాస్త్రము, సెల లవిసె ననంగఁ గప్పి చీఁకటు లెసఁగన్. 219

సీ. తరుచరుల్ కరగృహీతమహీరుహంబులు, మహియూఁదుకొని యొడల్ మఱచినిలువు
నిదురలతోఁ దూఁగ నెదుటఁ గనుంగొని, రాచూలి సౌరశరంబు వఱపి
యఖిలాంధకారంబు నడఁచి యాశ్రితుల స,మ్మోహబంధంబులు మగియఁ బాపి
వాసరంబు వెలుంగఁ జేసి శూలమున బ్రే, సిన నైంద్రశక్తిచేఁ దునిమె నదియు

తే. నిట్లు పోరి రయ్యిరువురు నేరిజయము, నెఱుకకెక్కఁ దయ్యాశ్చర్య మేమిచెప్ప?
విలయవాత్యలఁ దాఁకుచుఁ దలఁకుచుండు, కొండకవవోలెఁ దేరులు రెండు మెలఁగె.

వ. మఱియు నయ్యిరదంబులు చలితకేతనపటాంశుకంబులపేరం బుట్టి పక్షంబులు జళిపిం
చియు వికటంకఘటితఘంటానాదవ్యాజంబున వీరవాదంబు లుగ్గడించియు వలభిముఖ
విలంబిచామరచ్ఛవిచ్ఛలంబున నట్టహాసంబులు నెఱపియుఁ దూపులు దూఱఁగాఁడిన
నంగంబులం గలయంగనుపట్టుగరులమిషంబున నుత్సాహపులకాంకురంబులు దాల్చియు
బశ్చాదాకృష్టపురస్సారితత్వచ్ఛద్మంబునం దప్పుదాఁటితఱపాటు లలవఱిచికొనియు
నొండొంటితోడం బోరాడుజాడలం జూడ వేడుకలు పుట్టించె నయ్యవసరంబున.

ఆ. వార తేటుఁగాఁడ వాలమ్ము లిల యుచ్చి, చనియుఁ బైఁకి నెగసి తునిసిపడియు
నువ్వుగింజ త్రేయనుం జోటు లేకుండ, ముసుగునడఁగ నిండె ముజ్జగముల. 222

## శ్రీరాముఁడు రావణుం ద్రుంచుట.

వ. పోరి పోరి యలుక దెచ్చుకొని రఘునాయకుండు రాక్షసరాజు నీక్షించి. 223

క. పుడమిసుతఁ దేరఁ దోడసె, యిడుగెత్తెద ననుచు నింగి నరుదెంచితి వ
ప్పుడఁతిన్ మ్రుచ్చిలి తెచ్చుట, గడదాఁకఁగఁ బిడుగుపడియెఁగా పై నోరీ!. 224

వ. అని యదలించి. 225

ఆ. దేవమునివరోపదిష్టంబు రవిహృద, యము పఠించి రాముఁ డమరవైరి
తల్లలుదెంచెఁ దెంచె మొలతెంచె మొలతెంచె,మొలిచె మొలిచెమఱియు మొలిచె మొలిచె.

తే. అట్టిపోరాటలోపల నస్తమయము, లేదుగఁజెను నుదయంబు లేదుదోఁచె
దాశరథి యంతమీఁద పైధాత్రశరము,విహితమంత్రంబుచే లేపి వింటఁ దొడిగె. 227

శా. మీఁదం జూచి విరోధిసేయుటయు నున్మీలన్ముఖజ్వాలలన్
మీఁదుం గ్రిందును బోయెఁ బోయెఁ దియగ న్నిర్మించుసామగ్రులెం
దేదేదో పడియెన్ విధాత కనఁగా నిట్లేఁగి తీవ్రర్పషం
గాఁ దద్దివ్యశరంబు రావణునివక్షం బుచ్చి యత్యుద్ధతిన్. 228

క. చని నేలఁగాఁడి క్రమ్మఱ, మనుకులమణి దోనను వచ్చె మఘవాహితుఁడున్
దనపాటునఁ దే రొరుగఁగఁ, బెనుగుబ్బలి పడినగతి గుభేలునఁ బడియెన్. 229

క. గతజీవుఁడు త్రేఁ గనియెడు, కఱియది ముసి యయ్యెఁ బంక్తికంఠునియెడఁ దా
నతఁడు మును బ్రతికి వేఁగై, బతిమాలిచె జగముఁ జప్పి భారము వాపెన్. 230

ఆ. అతని యూర్పు శాంత మగుటయుఁ జల్లనై, విసరె మారుతములు వెఱపులేక
యతనిముఖవికాసమడఁగఁగా దిశలకుఁ, దేటవచ్చె నినుఁడుఁ దేజరిల్లె. 231

వ. తక్కిన గ్రహగణంబులు వెలుంగొందె బృందారకులు దుందుభిధ్వనిపూర్వకంబుగా శ్రీ
రామునిమీఁదం బువ్వులవానలు గురిసిరి గంధర్వగానంబులు బయలు మెఱసి వినవచ్చె
నంత. 232

## మందోదరీవిలాపము.

సీ. తనప్రాణవిభుఁడు పోయినపోక మందోద, రీదేవి విని నేలఁ ద్రెళ్ళి సఖులు
తెలుపఁగా నొక్కింత దెలి హా! దశకంఠ!, యని మోముచే మోదుకొనుచు లేచి
యవరోధసతులుఁ బౌరవినీలవేణులు, వెంట నంటఁగ వీడు వెడలివచ్చి
కటిబంటి నెత్తురుకాలువల్ వలువలు, నడియ నేడ్చుచుఁ జొచ్చి దాఁటి దాఁటి
తే. కొండునఁగుఱ్ఱలపీనుఁగుల్ కుంభకర్ణు, మొండెమును బంధుతనుఖండములును బడిన
పోలికలనిలోన మూర్ఛలు వోవుకొనుచు, వచ్చి నిజనాథుపై వ్రాలి వనరి వనియె. 233

వ. విభీషణుండును రామచంద్రునియనుజ్ఞం జని తనయన్నలకుం జాల వగచి తదీయతనయులకుం బలవించి యందఱకు నుచితవిధినగ్నిసంస్కారాదు లాచరించి యరుదెంచె నంత.

## విభీషణుని లంకాపట్టాభిషేకము.

క. ఆమ్రేడితకరుణారస, కమ్రమనోవాక్క్రియావకాశుఁడు లంకా
సామ్రాజ్య మొసఁగె రఘుపతి, నమ్రునకు విభీషణునకు నయగుణనిధికిన్. 235

## సీతారాములు పుష్పకారూఢులై యందఱితో నయోధ్యకేతెంచుట.

సీ. పొదచొచ్చి మైఁజల్లపడను దెచ్చిన సీతఁ. గెంగేలఁ దాపమాఱంగ నంటి
పొగడ వచ్చినవేలుపులదీవనల హత, ప్లవగుల బ్రతికించి పొఁజుచేసి
త్రిదివానతీర్ణుఁ దండ్రి భజించి లెక్క, దప్పను భవత్కృప నంచుఁ బలికి యనిచి
చండభానుజవిభీషణులతో దేవితో, సౌమిత్రితోడఁ బుష్పకము నెక్కి
తే. తేరు దేవేంద్రునకు నిచ్చి తిరుగఁ బనిచి, జనకజను లంకలోవింత లునికి చూపి
పైఁజనుచు సేతుగచన లుపన్యసించి, గగనయానంబు కిష్కింధకడను నిలిపె. 236

క. నిలిపినఫలాదివన్యము, లులుపాపట్టించె నినజుఁ డొడయని కవ్వాం
దులవెనుకఁ గపుల సుటుం, బులఁ గా నెక్కించుకొనియెఁ బుష్పకసుతేఁడున్. 237

వ. అనంతరంబ యచ్చోటువాసి చనుచో మనుతిలకుండు జనకజం గనుంగొని. 238

సీ. హనుమదాలోచనావని పంప యిది సుమీ, యదిసుమీ శబరిఁ గన్నట్టిపట్టు
ప్రతిబంధక కబంధమృతిదేశ మిది సుమీ, యదిసుమీ ఖరదూషణాజిధరణి
గోదావరియగస్త్యమేదిని యిది సుమీ, యదిసుమీ మాయలేడఁడఁగుచోటు
బుధనిరోధివిరాధవధభూమి యిదిసుమీ, యదిసుమీ ప్రథమోటజాజిరంబు
తే. చెలువ! కనుగొంటివే? యంచుఁ జిత్రకూట, మునకు డిగ్గి భరద్వాజమునివనంబు
కడ విమానావతరణంబు నడపి యన్న, హర్షి భజియించి యాతిథ్య మపుడు గాంచి.

వ. అందు నొక్కయెడ విశ్రమించి హనుమంతుని భరతుకడకు నిజాగమనవార్త వినిపిం
చంబంచిన నతండును నందిగ్రామంబునకుం బోయి శ్రీరామపాదుకారాధనతత్పరుం
డైన యారాజన్యఋషికి నాపతుండై తన్నుం దాను దెచ్చినవార్తయు నెఱింగించిన
నాలింగనం బొనరించి యాక్షణంబ యయోధ్యకు శత్రుఘ్ను ననిచిన నతండు చని
హజారంబున నుండి మంత్రులం బిలిచి రాజు వచ్చుం బురంబు శృంగారింపం బరిచార
కులం బనిచి మీరును బైసంబులై రండు లెండు పోం డెదురుకొనం బోవలయు ననిన
విని వారునుం బరమానందభరితులై యట్లన యాచరించి రప్పుడు. 240

క. బంగారుమిసిమి గులికెడు, ముంగుఁకుసుజులును ధూపసురభులు సౌధా
లిం గడచె రాజధానిన్, శృంగారముసకలదృగ్వశీకృతిఁ బొలిచెన్. 241

మ. పయనం బై చతురంగసేన లెదుటం బన్నం బ్రధానుల్ జగ
జ్జయలాభం బొడఁగూడె నేఁ డని మహోత్సాహంబునం దేరు లె
క్కి యనేకంబులు తూర్యముల్ దిశల అంకెల్ వ్రేయఁజేయన్ సమ
గ్రయశుల్ వచ్చిరి కొంచుఁ బట్టపుఁగరిన్ రాజెక్కుసామ్రాణులన్. 242

సీ. శత్రుఘ్నుఁడపుడు కౌసల్యాదిజనయిత్రు, లను దెచ్చెఁ బసిఁడిపాలకులలోన
వారిఁ దోకొని పన్ని వచ్చినమంత్రులు, వివిధసేనలు గొల్వ వెంటఁ దవిలి
సాకేత మంతయుఁ జనుదేరఁగఁ బరాశ, రమునీంద్రుతోఁ బురస్కరించి
కొనుచు నందిగ్రామమునఁ జేరుచో భర, ద్వాజు వీడ్కొని రఘువరుఁడు వచ్చి

తే. భూమిజయు లక్ష్మణుఁడుఁ దానుఁ బుష్పకంబు, నచట డిగ్గి నిజాంఘ్రిపద్మానతులను
భరతశత్రుఘ్నులఁ బ్రసన్నకరుణఁ జూచి, వంశగురునకు మ్రొక్కి దీవనలు గాంచి.

క. కౌసల్యం గైక సుమి, త్రాసాధ్విఁ బ్రణామములపరంపర లెసఁగం
గా సేవించి తదాశీ, ర్వ్యాసితముని జయజయేతివచనప్రియుఁ డై. 244

## ⊸ శ్రీరాముల పట్టాభిషేకము. ⊸

వ. సంతసంబునం బొదలిరి తదనంతరంబు. 245

సీ. గురుజనానుమతి రఘుస్వామి లక్ష్మణ, భరతుల కభినవాభ్యంగవిధులు
సాగించి మంగళస్నానక్రియానంత, రమున శత్రుఘ్నుఁడు విమలవసన
గంధమాల్యామూల్యకమనీయభూషణ, ప్రతతి నన్నల నలంకృతులఁ జేసె
కూర్మికోడలిఁ దోడికోడండ్రతోఁ గూడి, యొడలోమి కౌసల్య యుపచరించె

తే. రాముఁడు తలంచినప్పుడ రమ్మటంచుఁ, బలికి ధనదునికడకుఁ బుష్పకము ననిచి
యినసుత విభీషణాంగదహనుమదాదు, లకు నలంకారవాహనాదికము లొసఁగి. 246

క. తారాదిసతులకును మణి, హారాదివిభూషణమ్ము లమ్మలచేఁ బే
ర్వేరు వరుస నిప్పించియుఁ, బౌరుల హితమంత్రులం గృపం గనుఁగొనియున్. 247

శా. శ్రీమన్మంగళవైభవంబులఁ బ్రవేశించెం బురంబున్ మునుల్
ప్రామిన్కుల్ పఠియింపఁగాఁ గ్రమమునన్ భద్రాసనం బెక్కె మి
ర్మి మీరాజ్యము లేలుఁ డం చనిచె సుగ్రీవాదులం బెంపుమై
సౌముఖ్యంబునఁ బ్రోచు చుండె రఘువంశస్వామి లోకంబులన్. 248

ఆశ్వాసాంతము.

శా. భూపాలాగ్రణి! సత్యసంధ! కలశాంభోరాశిగాంభీర్య! యో
షాపంచాస్త్రి! కృపానిధీ! యుభయవంశశ్రేష్ఠ సాహిత్యగో
ష్ఠీపాండిత్యధురీణ! నిత్యజయలక్ష్మీవైభవా! దానవి
ద్యాపారీణ! భుజాబలార్జితసమస్తప్రాజ్యరాజ్యోదయా! 249

ఉత్సాహ. ఆర్యవర్య! పూజ్యధీరతాభిభూతనిర్జరా
హార్య! శౌర్యరాశి! భూసురాశ్రితానసైకతా
త్పర్య! పర్యటద్యశోవితాన! వైరిభూనరా
వార్యకార్యవేది! సూర్యవంశవార్ధికౌస్తుభా! 250

క. గండరగండ! హరిద్వే, దండకులాచలకిటీంద్రదర్వీకరరా
డ్దండనపాండిత్యసము, ద్దండమహీమండలావనభుజాదండా! 251

గద్యము. ఇది శ్రీమదొంటిమెట్టరఘువీరశతకనిర్మాణకర్మఠజగదేకఖ్యాతిగుర్వయ్యలరాజు తిప్పయమనీషిపర్వతాభిధానపౌత్త్రాక్కయార్యపుత్త్రపరిశీలితసమిద్ధరామానుజమతసిద్ధాంతమర్మ ముమ్మడివరదాచార్యకటాక్షవీక్షాపాత్త్రహృదయపద్మాధిష్ఠిత శ్రీరామభద్ర రామభద్రకవిప్రణీతంబైన రామాభ్యుదయమహాప్రబంధంబునందు సర్వంబును అష్టమాశ్వాసము.

రామాభ్యుదయము సంపూర్ణము.

చెన్నపురి: వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాలయందు
ముద్రితము.—1917.

# ఆంధ్రగ్రంథములు.

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రభారతము— | | | |
| ఆది, సభాపర్వములు గల సంపుటము | ... | 1 | 12 |
| ఆరణ్యపర్వముగల సంపుటము | ... | 1 | 12 |
| విరాటోద్యోగపర్వములు గల సంపుటము | ... | 1 | 12 |
| శాంతిపర్వము ,, | ... | 1 | 12 |
| ఆనుశాసనిక అశ్వమేధ ఆశ్రమవాస మౌసల మహాప్రస్థానిక స్వర్గారోహణపర్వములుగల సంపుటము | ... | 1 | 12 |
| ఆదిపంచకము, ఒకటే సంపుటము | ... | 5 | 0 |
| తక్కిన యుద్ధపంచకము రెండుసంపుటములు అచ్చగుచున్నవి. | | | |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము | ... | 0 | 10 |
| ఆంధ్రభారతవిమర్శనము, శ్రీమల్లాది. సూర్యనారాయణశాస్త్రిగారిది | ... | 0 | 8 |
| లంకావిజయము (రావణదమ్మీయము), సటీక, పిండిప్రోలు. లక్ష్మణకవికృతము | | 1 | 4 |
| కృష్ణరాయవిజయము, కుమార. ధూర్జటికృతము, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు | ... | 2 | 8 |
| నిర్వచనోత్తరరామాయణము, మేలుప్రతి | ... | 1 | 4 |
| ఉత్తరరామాయణము, కంకంటి. పాపరాజప్రణీతము, చక్కనికూర్పు | | 1 | 8 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనిక్రొత్తకూర్పు | ... | 3 | 8 |
| గోపీనాథరామాయణము, శ్రీమద్రామాయణమునకు సరియైన పద్యకావ్యము | | 4 | 8 |
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దక్షరములతో చక్కగ ముద్రితము | | 0 | 8 |
| అచ్చతెనుఁగురామాయణము, శుద్ధప్రతి | ... | 1 | 4 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది, మేలుప్రతి | ... | 4 | 0 |
| డిటో ,, అత్యుత్తమప్రతి, 2 సంపుటములు | ... | 5 | 8 |
| వీరభద్రవిజయము, బమ్మెర. పోతనామాత్యప్రణీతము | ... | 0 | 12 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి. ఈ.

# ఆంధ్రగ్రంథములు.

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| మనుచరిత్ర, సటీక, చిన్నసైజు | ... | 1 | 8 |
| వసుచరిత్రవిమర్శనము, శ్రీచినసీతారామస్వామిశాస్త్రికృతము | ... | 1 | 0 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, దళసరికాకితములు, చక్కనికూర్పు | ... | 2 | 8 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలు కాగితములమీఁద చక్కఁగ మరల ముద్రించియున్నారము | ... | 3 | 0 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు | ... | 0 | 8 |
| కళాపూర్ణోదయము, దళసరికాకితములు | ... | 1 | 8 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు | ... | 1 | 8 |
| కవికర్ణరసాయనము, (మాంధాతచరిత్ర) | ... | 1 | 8 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది | ... | 0 | 14 |
| హరవిలాసము ,, | ... | 0 | 10 |
| కాశీఖండము, క్రొత్తకూర్పు ,, | ... | 1 | 8 |
| నరసభూపాలీయము, అట్టబైండు | ... | 0 | 8 |
| విజయవిలాసము, చేమకూర. వేంకటకవికృతము | ... | 0 | 4 |
| సారంగధరచరిత్ర ,, | ... | 0 | 8 |
| బిల్హణీయము, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| వైజయంతీవిలాసము ,, | ... | 0 | ౨ |
| రంగరాయచరిత్ర, దిట్టకవి. నారాయణకవిప్రణీతము | ... | 0 | 8 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు. రామభద్రకవికృతము | ... | 1 | 4 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి. తిమ్మకవికృతము | ... | 0 | 4 |
| రసికజనమనోభిరామము, శుద్ధప్రతి ,, | ... | 0 | 8 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి | ... | 0 | 6 |
| రాజశేఖరవిలాసము ,, | ... | 0 | 8 |
| పారిజాతాపహరణము ,, | ... | 0 | 6 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము | ... | 0 | 8 |
| అనిరుద్ధచరిత్ర, కనుపర్తి. అబ్బయామాత్యప్రణీతము | ... | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము | ... | 1 | 4 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము | ... | 0 | 6 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ. వెంకమ్మప్రణీతము | ... | 0 | 14 |
| రాజయోగసారము, ద్విపద ,, | ... | 0 | 4 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి. ఈ.